# శ్రీ రామమోహన ఆయుర్వేద ధర్మవైద్యశాల అండ్ ఫార్మసీ

## బెజవాడ. స్థాపితము: 1915

శ్రీ రామమోహన ఆయుర్వేద ధర్మవైద్యాలయము 1 వ ఆగష్టు 1915 సం॥రమున క్రీ॥ శే॥ శంకర వెంకట్రామయ్యపంతులు, టొడ్డపాటి వెంకటప్పయ్యపంతులుగార్లచే స్థాపింపబడినది. ఈ ధర్మవైద్యాలయము క్రమాభివృద్ధి నొందుచు అనేక వేల బీదలకు కల్పవృక్షమై ప్రజాసేవచేయుచున్నది. ధర్మవైద్యశాలకు వలయు ఔషధములను తయారు చేసికొనుచు,కోరినవారికి శాస్త్రీయమైనట్టియు,నమ్మకమైనట్టియు, ఔషధములను సప్లయిచేయనుద్దేశముతో దీనికనుబంధముగా నొకఫార్మసీ నెలకొల్పబడినది. యీఫార్మసీయందు తయారుచేయబడిన ప్రతిఔషధమును ధర్మవైద్యశాలయందు అనేకమంది రోగుల కుపయోగించి గుణముచేయుచున్నట్లు పరీక్షింపబడినది. యీఔషధముల అమ్మకముపై వచ్చు ఆదాయము తిరిగి ధర్మవైద్యశాలాపోషణమునకై వినియోగింపబడుచున్నది. ఈవైద్యశాల బెజవాడ, గవర్నరుపేటయందలి బందరురోడ్డుపై ఉన్నతమగు స్వంతభవనమునందున్నది. యీధర్మవైద్యాలయమునందు ప్రతిదినము సుమారు 200 మంది రోగులు ఉచితముగ చికిత్స నొందుచున్నారు. వలయువారు విలువగల ప్రసిద్ధౌషధములను కూడ కొని వాడుకొనుచున్నారు. ఆయుర్వేదచికిత్సయందు నిపుణులును, మంచి అనుభవముగల ఆయుర్వేదవైద్యులు దీనియందు పనిచేయుచున్నారు. తమకు కావలసిన సలహాలను, చికిత్సలను వీరివలన నుచితముగా పొందవచ్చును. ఔషధములన్నియు యథాశాస్త్రీయముగా తయారు చేయించబడుచున్నవి. ఇపుడు సుమారు నలుబదివేల రూప్యముల విలువగల నాల్గువందల ఔషధములు సిద్ధముగానున్నవి. ఇన్ని ఔషధములు నమ్మకముగా ఒకచోటను లభించుట దుర్లభము. దేశమునందలి పలువురు ప్రముఖులు యీఔషధములను కొనియాడుచున్నారు. యీఫార్మసీయందలి ఔషధములను ఉపయోగించు విధానమును, పథ్యమును, అనుపానములును చక్కగా తెలియుటకై అనుపానపథ్యమంజరిని ప్రకటించియున్నాము. ఇన్ని ఔషధములను యింతపెట్టుబడితో తయారుచేయుటకు సామాన్యవ్యక్తులకు సాధ్యముకాదు. యీఔషధములను నిర్దుష్టములుగా తయారుచేసి వైద్యులకెల్లరకు నందుబాటులో నుండునటుల స్వల్పధరలకు విక్రయించుచున్నాము. ఈఔషధములపై వచ్చు ఆదాయము యెవరిస్వార్థమునకుగాని వినియోగింపబడక తిరిగి ధర్మవైద్యశాలాపోషణమునకై వినియోగింపబడును. దేశీయులెల్లరు యీఔషధములను కొని తన్మూలమున ఆయుర్వేదాభివృద్ధికిని, యీధర్మవైద్యశాలకును తోడ్పడ ప్రార్థితులు.

ఇట్లు,
కోట వెంకటాచలం ఆనరరీ సెక్రటరీ.

ఔషధములు, యితరవిషయములు వలయువారు:— సెక్రటరీ, శ్రీరామమోహన ఆయుర్వేద ఫార్మసీ, బెజవాడ. అని వ్రాయవలయును.

(1) సిద్ధమకరధ్వజము తు॥ 1 కి రు 40—0—0.

ఇందు అర్థభాగము బంగారము భస్మరూపమున కలదని హామీనిచ్చెదము. యుక్తానుపానములచే సేవించిన నపుంసకత్వము, నరముల బలహీనత, శుక్లనష్టము, బుద్ధిమాంద్యము, క్షయ, దగ్గు, శీఘ్రస్ఖలనము, అతిమూత్రము, మధుమేహము, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదము, జీర్ణించిన సుఖవ్యాధులు, పక్షవాతము శ్వేతరక్తప్రదరములు, సమస్తప్రమేహములు, పాండువు మొదలగు వ్యాధులను పారదోలును.

(2) మ క ర ధ్వ జ ము తు 1 కి రు 20—0—0.

ఇందు శివవంతు బంగారము చేర్చబడి పైగుణములనే కలిగియున్నది.

(3) ర క్త మా రే శ్వ ర ము. తు 1 కి రు 10—0—0

ప్రమేహము, రక్తపిత్తము, స్త్రీల తెలుపు, ఎరుపు, పసుపు నలుపు వర్ణముగల కుసుమవ్యాధులకు.

(4) శ్రీ మ ద్వృ ద్ధి ల క్ష్మీ వి లా స ర స ము తు 1 కి రు 10—0—0

ఇయ్యది క్షయరోగులకు అమృతమువంటిది. క్షయ, శ్వాసకాసలు, జీర్ణజ్వరము, శరీరకృశత్వము, రక్తహీనత, పాండువు మొదలగువానిని పోగొట్టును. శరీరబలము, కాంతి, శుక్ర ఓజస్సులను వృద్ధిచేయును. ఇందు బంగారము, మంచిముత్యములు, మంచిగంధములు మొదలగు విలువగలవస్తువులు చేరియున్నవి. అన్నితత్త్వములకు అనుకూలించును.

(5) ర స రా జ ర స ము తు॥ 1 కి రు 10—0—0

ఇది స్త్రీలకు నరముల బలహీనతచేకలుగు హిస్టీరియా అను యోషాపస్మారమునందు అద్భుతమైన గుణమును యివ్వగలదు. మరియు నరముల బలహీనత, గుండెదడ, వాతవ్యాధులను నివారింపజేయును.

(6) మ హా క న క సుం ద ర ర స ము తు॥ 1 కి రు 60—0—0

ఇందు సగము బంగారము భస్మము చేరియున్నది. క్షయరోగమునందు చెప్పిన సకలౌషధములకు నాయకమణివంటిది యీయౌషధము. పాండువు, కామిల, శ్వాసకాసలు, జీర్ణజ్వరములను పోగొట్టి శుక్రము, బలము, వర్ణము, కాంతి, పుష్టి వీనిని కలుగజేయును.

(7) వ సం త కు సు మా క ర ము తు॥ 1 కి రు 20—0—0

అతిమూత్రము, మధుమేహము మొదలగు ఇరువది ప్రమేహములు, స్త్రీలకు కలుగు శ్వేతరక్తప్రదరములు, కృశించుట, కాళ్ళుచేతులు మంటలు, కొంకి లాగుట, ఎల్లప్పుడు శరీరము వెచ్చగానుండుట, జ్ఞాపకశక్తి లేకపోవుట, మూత్రకృఛ్రము, మూత్రాశ్మరి, మేహపిటకములు, క్షయ, అతిశీఘ్రస్ఖలనము, నోటిపూత, గుండెదడ, నడుమునొప్పి మొదలగు సమస్తవ్యాధులను ఖండించును. బంగారము, మంచిముత్యములు కస్తూరి మొదలగు విలువగల వస్తువులను చేర్చి తయారుచేసియున్నాము.

(8) పూ ర్ణ చం ద్రో ద య ము తు॥ 1 కి రు 12—0—0

పాండువు, గుండెదడ, క్షయ, అజీర్ణము, కాళ్ళుచేతులు మంటలు, ఇంద్రియస్ఖలనము, వాంతులు బలహీనత, దగ్గు మొదలగు వీటిని నశింపజేసి వీర్యవృద్ధిని స్తంభనమును కలుగజేసి మనోల్లాసము నిచ్చును.

(9) త్రై లో క్య చిం తా మ ణి తు॥ 1 కి రు 20—0—0

ఇందు వజ్రములు మొదలగు రత్నముల భస్మములు చేరియున్నవి. ప్రాణావసానకాలమందు దీని నుపయోగించిన యెంతవరకు తప్పక ప్రాణదాన మొసగును. ఎంతటి శ్లేష్మమునైనను వెంటనే ఖండించును. వాతవ్యాధులు కాల క్షయ కాస శ్వాస మొదలగువ్యాధులను నశింపజేయును.

సువర్ణక్రవ్యాదరసము తు॥ 1 కి రు 4—0—0లు. బాలచంద్రోదయము తు॥ 1కి 2—0—0లు